దాసరి ఇలా అంటూనే-చిరునవ్వుతో రాక్షసుడు అతని కెక్కిలి పైన కొట్టి 'తెప్పవండించితివి (వంచించివి) దాసరీ! అడవుల్లో దారులు కొట్టి కొట్టి మేము పెంచి నిన్ననే గదా దాసరి వయ్యావు. ఈ నన్ను కొంచెం చేసి తాడుకొరికేసుకొని తప్పించుకుపోవాలను కుంటున్నావు. నిన్ను మెచ్చు కుంటున్నా'![40]

ఏ రాజ్యం నరుడు నోటికడి పోగొట్టుకొని నీ బోధ వింటాడు? మరే రాజ్యం నరుడు బానకోసం శరీరం ఇవ్వడానికి తనకు తానే తిరిగి వస్తాడు? నీకు సంతోషం కలిగేట్లు నేను పంపనూ పంపను. ఒకవేళ నేను పంపినా నీవు రానూరావు. ఇది తేటతెల్లం. అంతేకాదు! రచ్చలేల? పలు పల్కులు ఏల? చింత లేల? మాయలేల'?[41]

అని రాక్షసుడంటూనే-దాసరి చెవులు మూసుకొని 'నారాయణా అంటూ' 'నన్ను నమ్మవా! రాక్షసా! ఒక శపథంతో నమ్ము' అని రాక్షసుడు అంగీకరించగా-వేలకు వేల సత్యాలు పలికినా అతడు వినలేదు.[42]

'ఎవ్వని చూపుతో జగం జన్మిస్తుందో' ఎవ్వనియందు నివసిస్తుందో, ఎవ్వని యందు నశిస్తుందో అలాంటి విష్ణువుతో-మరొక దేవుణ్ణి సాటి పలికిన పాపాత్ముణ్ణవుతాను-ఎలాగైనా నేను నీ వద్దకి రాక పోతే'-అన్నాడు దాసరి. ఆ మాటలు విని రాక్షసుడు దాసరి బంధం విప్పేశాడు.[43]

ఆ దాసరి రాక్షసుని బంధం ద్వారా తన పాపలేశాన్ని పోగొట్టు కున్నాడు. భగవంతుని దర్శనానికి అయిన ప్రతి బంధకం తీరిపోయింది. కురుంగుడి వెళ్ళి కమల నేత్రుడైన శ్రీహరికి సాగిలబడి మొక్కాడు. విపంచి వాయిస్తూ స్తుతుల్తో కూడిన ప్రబంధాల్ని (గేయాల్ని) స్వామి చొక్కి పోయేట్లు పాడాడు అసత్య భీతి భారంతో త్వర త్వరగా వచ్చి-వ్రతపూర్తి అయినందు వల్ల పీడ పోగొట్టుకున్న దాసరి రాక్షసునితో ఇలా అన్నాడు.[44]

'ఓ రాక్షసా! నీ చెర వదిలి పోతున్న-నేను చక్రిని భజించగా-మోహాను భవం వర్ధిల్లినది. ఇప్పుడు నాకు ఏ చెర భయమూ లేదు. నువ్వు నన్ను పంపేటప్పుడు-ఏ చరణాలు, ఏ ఉదరం. ఏ ఉరం. ఏ శిరం. ఏ చేతులు

ఉన్నాయో-అవే చరణాలు, అదే ఉరం, అదే శిరం. అవే చేతులున్నాయో లేవో చూసుకో![45]

అని దాసరి ఇలా చెప్పగానే, అతని సత్త్వానికి ఆనంద బాష్పాలు ప్రవహిస్తూ ఉండగా,-హర్షంతో పులకించిన గాత్రం గలవాడై-బ్రహ్మరాక్షసి సూర్యుని మధ్యాహ్నపు ఎండ తన పెద్ద బట్టతల మీద మెరవగా, దాసరి వద్దకు పరుగెత్తుకొచ్చాడు.[46]

రాక్షసుడు కొండలాగా దాసరికి భక్తితో ప్రదక్షిణం చేస్తూనే-తనను కుట్టివేసిన చెట్టు చుట్టూ పాకల వ్యాధి గ్రస్తమైన ఏనుగు లాగా తిరిగి-అతని నొసలు దాసరి పాదాల మీద ఉండేట్లు-కొండలు మారు మోగేంత ధ్వనితో అతన్ని స్తుతిస్తూ సాగిల పడి, తన కోరలతో దాసరి పాదాలు ఒకటొకటి ఎత్తి తన శిరంపై పెట్టుకొన్నాడు.[47]

ఈ లోకంలో దేవతలు, దానవులు, రాజులు, మునులుఇలాంటి శరీర దానంలో కాక-వేరే కార్యాల్లో తమ వాగ్రూప వ్రతాన్ని తీర్చుకున్నరు గానీ-నీలాగా శరీర దానం అనే దారుణ ప్రతిజ్ఞను తీర్చుకున్న వారులేరు. నేను ఎంతో వృద్ధునిగా చిరకాలం జీవించిన వాణ్ణి. నీలాంటి ప్రతిజ్ఞా నిర్వాహకులు జగంలో లేరని ప్రతిన చేస్తున్నాను.[48]

ఓ దాసరీ! ఈ నీ ధైర్యం, నీ స్మృతి, నీ సత్యభాషితమైన గతి యందలి చరిత్ర ఎవ్వరికీ లేవు. నీవు మురారి పద సేవనమే జీవన మణివిగా ఉండేవాడివి. కురుంగుడి న బి కృప అధారంగా కలిగిన వాడివి, మధుర మైన హరి స్తోత్రగానం అనే సముద్రపు అలల్ని-దివ్య నాథ ప్రదంగా తుంబి కట్టిన నీ వీణ అనే తెప్పతో-దాటుతున్నావు. అలాటి నీకు ఇతరులు సమానమా'[49]

అని రాక్షసుడు ఇలా అంటూనే-అతణ్ణి భాగవత శ్రేష్ఠుడైన దాసరి కౌగిలించి-ఇలా అన్నాడు 'రజనీచరేంద్ర! అనఘుడా! నా వ్రతం ఈ దినం పూర్తి చేయించావు. నీ అత్యంత కృపా కటాక్షం వల్ల ధన్యుణ్ణయ్యాను.'[50]

"బండి కండ్లులా అస్థిరమైనవి ఆసలు. అదీ ప్రాణ భయంతో అట్టి ఆసలు చేసినా-కష్ట సాధ్యమైన భోజనాన్ని ఎవరైనా వదులుకుంటారా?

ఇలా వదులుకోడం నీకే చెల్లింది. బ్రాహ్మణ వంశంలో పుట్టిన రాక్షసా రాక్షసులకు 'పుణ్యజనులు' అనే పేరు-నీ వల్లనే ఆ రాక్షస కులానికి సమకూడింది.[51]

మహా ఆకలితో కడుపు నకనకలు పడుతూ ఉండగా - నన్ను ధన్యుణ్ణి చేయడానికి వదిలావు. మేము జాతి ధర్మంగా మీకు బ్రహ్మ విధించిన కూడు-నీకు ఏ పాపం కూడా అంటదు ఇకేమన్నా నా మీద ఒట్టు! నా మీద ఏ మాత్రం స్నేహం ఉన్నా బడలిక తీరేట్లుగా నా శరీరాన్ని పారణ చెయ్యి![52]

ఓ సురవిరోధీ! ఈ నా మాటలో పొరపొచ్చెం లేదనడానికి ఈశ్వరుడే సాక్షి. నా శరీరంలోని మెదడు నిండుగా గలిగిన, క్రొవ్విన మాంసాన్ని భక్షించు అని దాసరి అంటూనే రాక్షసుడు ఆర్తితో-[53]

"ఓ పుణ్యాత్మా! ఇలా దయలేకుండా పలకడం బాగుందా! ఇన్నాళ్ళు ఈ కూడే-ఈ పొట్టన బెట్టుకొని-మహా పాపబుద్ధితో ఈ తనువును పోషించాను. ఎన్నాళ్ళకైనా, ఎలాగైనా ఒక తపస్వి గానీ, ఒక వ్రతిగానీ రాడా! నన్ను చూడడా! అతని కృపతో ఈ పుట్టువును పోగొట్టుకుంటాను-అని వేచి ఉండగా నీవు వచ్చి కూడా ఇలా అంటున్నావే![54]

మీ వంటి భాగవతులు కూడా మా వంటి వారిని పావనులుగా చేయకపోతే మరి ఏకేది గతి? మా వెనుకటి హేయ వృత్తిని పట్టించుకోకుండా దయతో కటాక్షించు![55]

పరుసవేది నిరపరాధి అయిన గొడ్డలిని గానీ, ద్విజుణ్ణి చంపిన శస్త్రాన్నయినా సరే (అవి రెండూ ఇనుమే కాబట్టి)-రెండింటినీ సమంగానే బంగారు చేస్తుంది. మా బోటి వాళ్ళ విషయంలో మీ బోటివాళ్లు ఈ అసాధారణ న్యాయాన్ని అవలంబించవద్దా?![56]

అని రాక్షసుడు అంటూనే - తన దేహార్పణను అంగీకరించక అర్తితో పలికే దీనత్వానికి నీ తాత్పర్యమేమి? అని దాసరి అడిగాడు. 'నీ శరీ

రాన్ని వాకిస్తాను అనడం దయకాదు! నా ఆత్మ కాలుష్యాన్ని పోగొట్టడమే దయ![57]

నా కర్మం ఘంటాకర్ణుని కర్మను మించిందా? అతడు మౌనీంద్రుల్ని తుంటలు చేయలేదా? ఆ పాపం మాన్పి భగవంతుడు అలాటి మోక్షశ్రీని దయచేశాడే! దేవుడిచ్చిన మోక్ష సామ్రాజ్యం కంటె భాగవతుడు మించుగా ఇవ్వకలడే! మరి ఆ మేలు నాకంటించరాదా! ప్రాణిమేలు చక్రికి పూజవం కాదా![58]

అని రాక్షసుడన్నాడు, అది విని దాసరి 'ఆ విధం ఎలాగ పొసగుతుంది' అన్నాడు. బ్రహ్మ రాక్షసుడు ఇలా అంటున్నాడు! నేను ఒక బ్రహ్మ రాక్షసుణ్ణి. నా పేరు కుంభ జానువు. పాప కర్ముణ్ణయి ఈ మర్రిచెట్టు నాశ్రయించి-వంచనతో బాటసారి జనాన్ని తింటూ ఉంటాను. పూర్వజన్మలో నేను సోమశర్మ అనే బ్రాహ్మణుణ్ణి. పూర్వజన్మలో విప్రుణ్ణి కాబట్టి - దయనీయుణ్ణి ఒక దుష్కర్మవల్ల ఇలా అయ్యాను నీవు విష్ణువును పాడిన ఈ పాట ఫలం సజలంగా వాకిస్తే భీభత్సమైన నిందకరమైన ఈ నా జన్మం పోతుంది. నీకు ఆర్త రక్షణంతో వచ్చే అనంత సుకృతం సిద్ధిస్తుంది. అత్యంత ధర్మసాధనమైన నీ మేను ఇల్లు చేరుతుంది'-అని రాక్షసుడు పలికిన శరీరం కోసమైన ఆ మాటలకు కల కల నవ్వి ఆ విష్ణుదాసుడు ఇలా అన్నాడు.[59]

'నేను ఇలాంటి దేహాల్ని, ఇంతకన్నా ఉత్కృష్ట దేహాల్ని, ఇంతకన్నా అధమ దేహాల్ని ఎన్నో పొందాను. ఆ శరీర పరంపరల్లో ఈ చండాల దేహమూ ఒకటి. ఈ శరీరం కోసం ఒక నాటిది కాదు కదా-ఒక క్షణం గీత ఫలం కూడా ఇస్తానా. [60]

నేనూ, నీవు ఎన్నిమార్లు దిక్పాలతను వెత్తలేదు? వెంటనే తిరిప తనువు ఎత్తలేదు? ఎన్నిమార్లు సింహాం తనువు ధరించలేదు? వెంటనే కీటక శరీర మెత్తలేదా? ఏనుగు శరీరాలు ఎన్నిసార్లు తాల్చలేదు? వెంటనే దోమ తనువు ఎన్నిసార్లు తాల్చలేదు. ధరణీశ తనువు ఎన్నిమార్లెత్తలేదు? వెంటనే

దాస తనువు ఎత్త లేదా? ఎన్నిసార్లు సోమయాజులం కాలేదు? చండాలులము, పశులము ఎన్నిసార్లుకాలేదు? పాములము, పిశాచులము ఎన్నిసార్లుకాలేదు. ఒక హరి భక్తులం మాత్రమే కాలేదు గానీ![61]

ఈ శరీరం చేపల్ని పట్టే ఊత (ఒక సాధనం)లో వచ్చిన నీళ్లు లాంటిది. సాతెపురుగు నేతలో ముడిచి ఉంచిన బూరుగు దూది. ఎండలోని పసుపు, దూలంలో పురుగు తొలచిన తొర్రి అక్షరం, అలాంటి మేను మీద మమతతో పుణ్యం అమ్ముకోవడం ఎలాంటిదంటే-కప్పురం ఇచ్చి ఉప్పు కొనుక్కున్నలాంటిది'.[62]

అని దాసరి అన్నాడు. దానికి రాక్షసుడు ఇలా అన్నాడు, 'ఓదాసరీ! ఈ నాటి సంగీత ఫలంలో సగమైనా దయతో ఈవా? చేపమింగే గుక్కెడు నీటితో సముద్రానికి తక్కువవుతుందా? నీవిచ్చే సంగీత ఫలంతో నీ విష్ణుకీర్తనకు కొరత ఏమి వస్తుంది?'[63]

ఇలా రాక్షసుడు అంటూనే దాసరి- 'ఇలా దేహంకాని దాన్ని అడిగి నన్ను ఏల నొప్పిస్తావు? నీకు నేనిచ్చిన మాట నా శరీర మాంసమా? లీలా వటువైన విష్ణు కీర్తన ఫలమా? పాతాళ ప్రశ్నలు మానేసి-నా శరీరాన్ని గ్రహించు! పిశాచ జాతికి సాధారణమైన వంకర మాటల్తో నన్ను మాయ చేద్దామనుకుంటున్నావా? అలా నీవు భావిస్తుంటే-బావిని త్రవ్వితే భూతం పుట్టినట్లు అవుతుంది సుమా'.[64]

ఇలా దాసరి అన్న మాటలకు రాక్షసుడు చాలా కట కట బడ్డాడు. పని మీద శొక్కతో కన్నీరు గ్రుక్కుకున్నాడు 'కట కటా! చక్రికి సన్నిహిత దాసులు దయాళువులు కావద్దా! పూర్వం మత నిర్వాహకుడై బ్రహ్మ సూత్రాల్ని వివరించి, హరి యొక్క విశిష్టాద్వైతం ప్రతిష్ఠించిన లక్ష్మణుడు (రామానుజుడు) అనే యోగీంద్రుడు-చిరకాలం శుశ్రూషకు సంతుష్టుడై పూర్ణాచార్యులు అనే తన గురువు గీతా చరమార్థం (గీత చివరి శ్లోకం-సర్వ ధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ! అహంత్వా సర్వపాపేభ్యో మో

చయిష్యామి భారత' అని గీత చరమ శ్లోకం) విధియుక్తంగా ఉపదేశించి 'అనధికారులకు (అయోగ్యులకు) ఇవ్వవద్దు' అని చెప్పాడు. అయినా రామానుజుడు వినకుండా దయా సముద్రుడై (దామోదర) అనే పేరు గలిగిన శ్రీరంగనాథుని గుడి బంగారు గోపురం ఎక్కి, ఉచ్చైస్స్వరంతో ఆ గీతా చరమార్థం ఉచ్చరించాడు, గురువు అలిగాడు. దానికి రామానుజుడు గురువుతో 'దేవా! దేవర ఆజ్ఞ మీరి నేనొక్కణ్ణే రౌరవ నరకంలో పడడం మేలో! భాగవత పరిషత్తుకు పరమ పదం లభించడం మేలో? అని వితర్కించి నీవు ఉచ్చరించినట్లుగా భావించి గీతాచరమార్థం ఉచ్చరించాను'-అని చెప్పి గురువు చేత అభినందితుడయ్యాడు.

ఆ రామానుజుడే-తన శిష్యసమూహానికి ప్రతి దినం ఉదయం వెల తీసుకోకుండా పాలు, పెరుగు, నేయి (గవ్యం = గోసంబంధమైనవి) సమర్పించి-తనను వేడుకొన్న యాదవ స్త్రీ పురుషులకు ముక్తి ప్రసాదించాడు.

ఆ రామానుజుడే బంధరహితుడై కూడా మరో అవతారంలో-మరో కాలంలో-సంకుచిత జ్ఞానులైన భోగలాలసులైన మానవులకు ముక్తి మీద తీపు పుట్టేట్లు-'సుందర జామాత' అనే పేరితో అర్చిరాదిగతిని (ముక్తులైన వారు సూర్యమండలం ఛేదించుకొని వెళ్ళే మార్గప్రకారం) విశదీకరించాడు.

ఆ రామానుజుడే ఇక మీద యాదవగిరి సెంకణం (తిరునారాయణ పురప్రాంతం) పాషండులతో నిండినపుడు, వారి నాశనానికి శఠకోప యతి అనే పేర్తో ఉద్భవించి, ఆంధ్ర మొదలైన దేశాల వందిత జనాల్ని విష్ణు సంబంధమైన వాద భిక్షకు అర్థించి దిగ్విజయం చేస్తాడు. అహోబల గుహలో అప్రతిమానుడైన నరసింహుడు కుహనా యోగిగా దర్శనమిచ్చి - జపాసనాన్ని, కాషాయాన్ని, కమండలువును ప్రసాదించగా - శఠకోపయతి సన్యాసాశ్రమం స్వీకరిస్తాడు. శేషుడు, కణాదుడు, గౌతముడు, వేదవ్యాసుడు, కపిలముని, జైమినుల మతాల్ని-తనమఠంలోని వంట బ్రాహ్మణుల్తో సహా తన శిష్యులకు ఎంతో చక్కగా బోధించి-పరమ హంసల అనుష్ఠానానికి పరమావధి అవుతాడు. తన పాద ద్వంద్వానికి ప్రపత్తి చేసిన లోకంలోని నరుల హృదయ భవనాల్లో వల్లేర్లు (కామక్రోధాది అంపడ్వర్గాలు) తుడిచి శ్రీలక్ష్మీ నారాయణుల్ని నెలకొనేట్లు-భక్తిని ఉపదేశించి భూమిని పావనం చేస్తాడు.

విష్ణుపద పద్మారాధకుడైన వేంకటేశుడు (వేదాంత దేశికులు) అనే మరో మనిషి విష్ణు ప్రతిపాదకమైన నూరు ప్రబంధాలు (గ్రంథాలు) రచించి శిలా (కోతకోసిన మళ్ళలో రాలిపడిన వెన్నుల్ని ఏరుకొని జీవించే వర్తనం) వర్తనంతోను, ఉంఛ (రాలిన నీవారాది ధాన్యం ఏరుకొని బతికే వర్తనం) వర్తనంతోను బతికే తనకు ముదురాకుల్ని ఇచ్చిన అగిసె చెట్టుకు మోక్షం ఇవ్వగలడు.

ఇలాంటి భవిష్యద్వర్తమానాలు - దివ్యజ్ఞానంతో నాకు తెలుసు. ఇలాటి త్రైకాలిక జ్ఞానం ఉన్నందువల్ల 'నా ఈ శరీరం మాననీయం గదా' అంటావేమో! ఆ త్రికాల జ్ఞానం జాతి ధర్మంగా వచ్చిందే గానీ-శమదమాదులవల్ల లభించింది కాదు, ఎరుకల స్త్రీ భవిష్యద్విషయాలు చెపుతుంది-ఆమె శుచియా? గుడ్లగూబ, డబ్బగాటి, గబ్బులుగు, కనుంబెంటి, పైడికంటి లాంటి పక్షులు-బల్లి లాంటివి మొదలైన పశు పక్ష్యాదులు-భవిష్యత్తులో జరిగే ప్రయోజనాల్ని సూచిస్తాయి. అవి తపస్వులా? అలాగే రాక్షసులైన మా విజ్ఞానం కూడా! ఎలాగంటే. నాస్తికత్వం వల్ల శాస్త్రాల్లో చదవడం, గ్రహించడం తప్ప-ఆచరణగానీ ప్రచారంగానీ లేనందువల్ల-మాకు ధర్మం దూరం అది కారణంగా-ఈ మార్గం తెలియక పోయినందువల్ల-భవబంధాల నుంచి బయట పడలేము. కలుషరహిత శరీరం వల్లగానీ - మోక్ష శుభం లభించదు. కాబట్టి ఈ వికృత రూపం గల శరీరాన్ని-అనుగ్రహంతో పోగొట్టి-ధన్యుణ్ణి చేయి అని దాసరి పాదాల మీద పడి పాటలో పాతిక పాలైనా రాక్షసుడు ఇవ్వమన్నాడు అతడు అది కూడా ఈలేనన్నాడు. 'పోనీ ఈ ప్రభాత సమయంలో పాడిన చివరి పాట ఫలమైనా ఇచ్చి-శరణాగతుడైన నన్ను ఆపదలేని వానిగా చేయి 'అని దాసరి పాదాల మీద నుంచి లేవకుండా అలాగే ఉన్నాడు. అలాంటి రాక్షసునిపై పరమ దయార్ద్రుడైన దాసరి 'అలాగే కానీలే' అని, అతన్ని లేవనెత్తి, ఆ రాక్షస తమ ప్రాప్తి విషయం వివరంగా చెప్పమన్నాడు. 'చిత్తగించండి'! అని రాక్షసుడు దుఃఖార్తుడై ఇలా అన్నాడు.[66]

## ఆశ్వాసాంత పద్యాలు

'స్వామీ! నీవు శ్రీకృష్ణావతారంతో ఉన్నపుడు నీ మహిమ పరీక్షించడానికి బ్రహ్మ గోకులంలోని గోవుల దూడల్ని గోప బాలకుల్ని మాయ చేశాడు. అలాటి బ్రహ్మ గర్వం అణచడానికి నీవే గోవుల దూడలై, గోప బాలకులై గోవుల్ని, గోప వనితల్ని సంవత్సరం పాటు సంతోష పెట్టావు. అప్పుడు బ్రహ్మ వచ్చి-నిన్ను స్తుతించి-తానపహరించిన గోవుల దూడల్ని, గోప బాలకుల్ని తిరిగి ఇచ్చి వెళ్ళాడు. అశ్వత్థామ పాండవ వంశ నాశకరమైన అస్త్రం ప్రయోగించగా-దాని జ్వాలలు అభిమన్యుని భార్య అయిన ఉత్తర గర్భంలో ప్రవేశించి-గర్భస్థ శిశువు రూపంలో ఉండే పరీక్షిత్తుని కాల్చబూనగా-నీవు మహిమతో ఆ అస్త్రాగ్నిని నీటి జడిలాగా చల్లార్చావు. నారాయణుడవైన నీవు సూర్యచంద్రులే విశాల నేత్రాలుగా గలవాడివి.[67]

నిరంతరం నవనవ రతిక్రీడల్తో గోపభామినులు నీపై ఉత్కట ప్రేమను కలిగి ఉంటారు. ధ్యాన తత్పరులైన మౌనుల మానసాలనే సరసుల్లో వసించే రాజ హంసవు నీవు ఉత్తమమైన పీతాంబర ధారివి నీవు[68]

నలుడు మొదలైన చక్రవర్తులు తమ కాలాల్లో కానుకలుగా కొత్తగా సమర్పించినవి, అమూల్య మనోహరాలు అయిన కిరీటాదుల్ని ఇప్పటికీ ధరించే శ్రీ వేంకటాచలపతీ! దేదీప్యమాన విగ్రహా! మురారి సంహరణా! సకల బ్రహ్మాండ నాథుడా! అనంత కళ్యాణ గుణ సంపన్నా! ఇంత అని ఎరుగరాని విశ్వరూపంతో అర్యుల్ని సంతోషపెట్టి రక్షించే స్వామీ!'[69]

## కృతికర్త స్వవిషయం

ఇది-సైరామనపురం సుల్తాను యొక్క మణి మయాలైన మహోన్నతాలైన సౌధాల్ని-తాను నడుపుకొని పోయిన ఏనుగుల దండుతో-పడగొట్టించిన కృష్ణరాయ ప్రభువు అనే నేను రచించిన ఆముక్తమాల్యదలో-ఆశ్వాస శ్రేష్ఠం ఆరవది-హృద్యమైన పద్యాలతో కూడినది[70]

## సప్తమాశ్వాసం

శివునికి బాణంగా-లక్ష్మికి నివాసంగా-సులభంగా లభ్యమైన దేహం గల స్వామీ! కువలయాపీడం అనే కంసుని ఏనుగును చంపిన స్వామీ! మకరాన్ని సంహరించిన చక్రాయుధం గలవాడా! సాధుజన సమూహానికి క్షేమంకరమైన పాదపద్మాలు గలవాడా! ఉజ్జ్వల బంగారు వస్త్రధారీ! వేంకటాచల రమణా![1] (ఆశ్వాసాది పద్యం)

## బ్రహ్మరాక్షసుని వృత్తాంతం

సావధానంగా వినండి! ఆ రాక్షసుడు దుఃఖార్తుడై ఇలా అన్నాడు-[2]

'చోళ భూమిలో ఒక ఊళ్లో నేను పదునాల్గు విద్యల్ని నేర్చి యాగ తంత్రజ్ఞుల్ని తప్పు పట్టుతుండేవాణ్ణి. ఖండకారికల పుస్తకాల్ని-షోడశ కర్మలు చేయించడానికి-స్మార్తులు విప్పగా పరిహసించేవాణ్ణి విద్వాంసుల సమూహం యొక్క గ్రాంథికత్వాన్ని జల్పవాదినై అవమానం చేసేవాణ్ణి.[3]

ఇలాంటి నడవడితో మదించిన ఏనుగులాగా మదాంధుణ్ణి అయి- నాకు అలవడిన అల్ప విద్యాలబ్ధికై-విడవడానికి ముడవడానికి వేసారిపోని పీసం (కొద్ది పాటి ద్రవ్యం) ఉండే రెడ్డిలాగా-ఆ చదువే పరబ్రహ్మంగా పెద్దలతో- చెణికి ఓడిపోయికూడా సరి అయ్యాయని, సరిపోయి జయించానని అబద్ధాలాడి- చిల్లర ప్రభువుల్ని భ్రమింపజేస్తూ ఉండేవాణ్ణి ఇలా ఉండగా దీక్షితుల్ని (యజ్ఞం చేయడానికి పూనుకొన్న వారిని) చూసి నాకు కూడా యజ్ఞాలు చేయాలి అనే కోరిక పుట్టింది. యజ్ఞాల కోసం ద్రవ్య భిక్షను కోరుకుంటూ మధురకు వెళ్ళి ఆ పురంలో-[4]

వెలివేయబడ్డ బ్రాహ్మణునికి అల్పప్రాయశ్చిత్తం చేసి-వాడిచ్చే బంగారం కోసం-వాని బంతిలో భోంచేశాను. వైశ్యుల పురోహితుల్తో కలిసి-

పుణ్యాహ వాచనాల్లో పురోహితునికి వచ్చే బియ్యం కోసం మొత్తులాడాను. సూర్యచంద్ర గ్రహణ కాలాల్లో నేను చేసే జపాలు స్నానాలు మొదలైన కర్మల ఫలాన్ని-దొరల వాకిండ్లకై ధారపోశాను. పచ్చి జింక తోళ్ళను, బర్రెల మేకల ఆవుల తోళ్ళ పాదరక్షలు-దానంగా గ్రహించడానికి ఊరంతా నేనే గుత్తపట్టాను.[5]

దర్భపోటుల్ని (శ్రాద్ధ భోజనాల్ని) తిని, శ్రాద్ధాలులేనప్పుడు శ్రాద్ధ కర్తల్లో స్నేహం చేసుకొని వారిండ్లకు వెళ్ళి-పితృశేషం (పితృదేవతల కోసం వడ్డించి శ్రాద్ధ భోక్తలకు పెట్టగా మిగిలిన అన్నం) భుజించాను. అదీలేనపుడు-అక్కవాడల్లో (పూటకూళ్ళ వాడలలో) అరకూళ్లు మెక్కాను. వీటన్నిటినీ మించి ఒక తులాభార దానం గ్రహించాను 6

ఈ విధంగా డబ్బు కూడబెట్టి - ఒక వైశ్యునికి వడ్డీకిచ్చి-మా ఊరికి పోవడానికి తిరిగి పూనుకొన్నాను. ఆ డబ్బును చౌకాలు (నాలుగేసి)గా లెక్కవేసి, వడ్డీ లెక్కలు కట్టి-'నేనమ్మిన బియ్యం మొదలైన వాటికి తక్కువ ధర గట్టావు' అని వైశ్యునితో ఘర్షణ పడుతూ, అతడు కోపంతో 'ఇస్తాను-ఇవ్వను' అని తిప్పి కొట్టినపుడు రచ్చకెక్కి కూతలు పెడుతూ-ఇలా జగడం చేస్తూ ఉండగా-ఒకడు కనిపెట్టి చూస్తూ ఉన్నాడు [7]

వెలివాడ నుండి నాణెమైన కొత్త చెప్పుల్ని నేను కొని నూనె పూసి తంగేడాకు తహ తహతో కట్టుతుండేవాణ్ణి, మాసిన మీసాల్ని, గడ్డాన్ని గొరిగించుకొని-వేణ్ణీటి అంగళ్లలో నిదానంగా-తలగడుగుకుంటూ ఉండేవాణ్ణి (అభ్యంగన స్నానం చేయడం) పాలు పెరుగు నేయి, కూరలు-వంట పుట్టి (పూట కూటి) ఇంటికి-ఎప్పటికంటే ధారాళంగా పంపుతుండే వాణ్ణి అడపం దులిపివేసి తమల పాకులు పోకలు దానిలో దండిగా చేర్చుతుండేవాణ్ణి. నా శిష్యుడైన బ్రహ్మచారి భుజం మీద అసిమి సంచి కోసం-వండేందుకు సిద్ధంగా బాగుచేసి ఉంచిన సడింపు బియ్యాన్ని సర్దుకునే వాణ్ణి ఆనందంతో నా భార్య కోసం మేలు చీరలు కొన్నాను ఇతర బాటసారుల్ని ప్రయాణ విషయం ప్రశ్నలు వేసి తెలుసుకొనేవాణ్ణి ఇవన్నీ చూసి ఒకడు నా ప్రయాణ సంగతి తెలుసుకొన్నాడు.[8]

వాడు నా తోడి బాటసారుల్లో ఒకడుగా కలుసుకొని వచ్చాడు. దారిలో మమ్మల్ని అటకాయించడానికి కొంతర్ని పంపాడు. బాటసారులందర్లాగా తానూ ఒక సంచి తీసుకొని-మాతో పాటు ప్రయాణం చేస్తూ ఉండగా ఒక చోట విద్రించాం. ఆ నిద్రలో ఒక పొద్దుకాడ లేచి 'ఉత్తరం, ఉత్తరం'- అని తాను లేచి పోయాడు.[9]

అలా వాడు లేచి పోతుండగా-తత్తరం అతిశయించి తోడి వారు వెళ్తూ ఉండగా-నేను మూట బరువును నా శిష్యుడైన బ్రహ్మచారి కెత్తి-నడుస్తున్నాను. ఆ దొంగ 'ఇలా రండి' అని అడవిలోకి దారితీసి-ఒక వాగులోకి మేం దిగగానే ఈల వేశాడు.[10]

అరచేతిలో గీతలు కనబడే వేకువ జామున-ఒక బాణం మా మీద పడింది. మా బాటసారుల సమూహం అలాగే విచ్చిపోయింది. రాళ్లు బిర్రు బిర్రున పడ్డాయి. ఆ రాళ్ళ వర్షంలో ముందుకు వెళ్ళడానికి తెరపిలేక-తెరువరుల గుంపు తొక్కుట పడసాగింది.[11]

ఇలా ఆ బాటసారులు తొక్కుట పడుతూ ఉండగా - వారిని ఆ అడవిలో - అతి వేగంతో ఒక దొంగల దండు వచ్చి ఆక్రమించింది. ఆ దొంగల దండు ఎలా ఉందంటే-ప్రళయ కాలంలో ప్రాణి కోట్లను భక్షించడానికి మహా ఆకలి తొందరతో-ముక్కంటి వక్కుల నుండి ఉల్కలు మొదలైన వాటితో పాటు దుముకుతూ-దిట్టతనంలో ఆక్రమిస్తున్న పిశాచుల దండులాగా ఉంది. ఆ దొంగల కత్తుల నీలకాంతి హాలా హలంతో పోటీ చేస్తూ ఉంది. ఆ నల్లని కాంతుల శ్రేణుల్ని చూసి-అవి రాహువులని భయపడి-సూర్యుడు దద్దరిల్లి పోతూ ఉన్నాడు ఆ కిరాతులైన దొంగల దండు-రాక్షసుల సేనని గెలువ గలిగినట్టిది. ఆ అడవిలో అతివేగంతో 'పొడు పొడు' అనే పలుకుల్తో పాటు-బాణాలు కూడా వేస్తూ-ఆ దొంగల దండు బాటసారుల్ని కమ్ముకొంది.[12]

ఇలా చెట్లనుండి బయటికి వచ్చి-విండ్లు వంచుకొని ముంచుకొని వస్తూ ఉన్న ఆ నల్ల జనుల్ని చూచి-బాటసారులు అల్లకల్లోలమై పలాయనం పఠిస్తూ ఉండే సమయంలో-[13]

ఆ బాటసారుల స్థితి ఎలా ఉందంటే-దొంగల గుంపులో 'పనలేదు నిలవండి! పాపులారా!' అని దేవాయుధాల్ని (కట్టెరాయి రప్ప ఇలాంటి వాటిని) కొందరు బాటసారులు రువ్వుతూ ఉన్నారు.

బంగారు ఉండే జాలెను చెట్లలో పడవేసి-దుడ్డుకఱ్ఱ పెట్లకు పరుగెత్తుతూనే - పైపంచెల్ని కొందరు పారవేశారు.

తాము మోస్తున్న భారాన్ని దింపేసి-కటారితో వైరిని చీల్చి నిలబడి,'ఇలా ఎక్కడికి వస్తారు'? అని కొందరు దొంగల్ని ఎదిరించారు.

'దేవతార్చన పెట్టెకు కట్టిన వస్త్రం తీసుకోండి' దేవరా! ఈ దేవతా విగ్రహం మీరు తీసుకోకండి. ఇది పోతే మేం ఉపవాసం ఉండాల్సి వస్తుంది' అని దయ కలిగేట్లు కొందరు దొంగలను వేడుకొన్నారు.

'మా గుంపులో ఉండేవన్నీ ఇప్పిస్తాం. పక్కకు తొలగండి. ఒక విషయం ఏమంటే! గుంపులోని స్త్రీల మీద చేయి వేయకండి' అని పెద్దతనం, అభిమానం తోచేట్లు పలికి-తమ వస్తువులన్నీ దోపు ఇచ్చి-అక్కడి నుండి కొందరు వెళ్లిపోయారు.[14]

ఆ దొంగలు బాటసారుల నుండి ఎలా దోచుకున్నారంటే-విల్లెక్కు పెట్టుకొని ముందుకు దూసుకు వచ్చి 'తోడు వింటివాడు' అయిన బాటసారి వెళ్ళే తోవకు అడ్డపడకుండా దొంగలు వెళ్లి-తక్కిన వాళ్లు ఎదురు పడినపుడు-తత్తర పడేట్లు గబగబా పొడిచారు. పిసినారి తన చేత వద్ద ఉన్నది ఇవ్వకుండా పెనగగా-వాణ్ణి పెద్దగా బాధించకుండా-ఎఱ్ఱపడేట్లు గాయంచేసి-వాని వద్ద ఉన్నది నాచుకొన్నారు.

తమ చేత చిక్కకూడా తప్పించుకొని దూసుకొని పారిపోయే వాడు-తమవేటుకు అందనంత దూరం వెళ్తూనే-వాణ్ణి వెంబడించడం మానేశారు. చేతిలో సొమ్ము లేకున్నా పుట పుటగా ఉండేవాణ్ణి-శోధించడానికి పక్కకు తీసుకెళ్లారు.

బాటసారులు పొదల్లో దూరతోగా-ఈటెల్ని పొదల్లోకి చాపి బయటికి వచ్చేట్లు చేసి-వారి కట్టుబట్టలు లాక్కొని-దయతో గోచులు పెట్టు

కొనేందుకు పాత బట్టల నిచ్చారు. చెప్పుటట్టల్లో గన వరాకులు నిగిడించి. సిగలు విప్పి శోధించారు.[15]

ఈ విధంగా దొంగలు పెచ్చు పెరిగి-విచ్చల-విడిగా నానా విధాలైన బాటసారుల సిరిసంపదల్ని కొల్ల కొట్టే సందడిలో-[16]

ఒక ప్రచండ చండాల చోర భటుడు నన్ను తరిమాడు - వాడు పిరుదు నుండి చను మరలు హద్దుగా ఉండేట్లు నిడుపైన సీలికాసె మెరిసేట్లు బిగించి కట్టుకొన్నాడు. అతని పిల్లి గడ్డాన్ని మించి మీసాలు - కుండలాంటి కడుపు మీద ఉయ్యాల లూగుతున్నాయి. బూడిద పూసుకొన్న మొగం మీద చెంపలను మూసేట్లు కట్టిన గౌదకట్టు మైనపు మడ్డితో పూసిన పాత కుళ్లాయి లాగా ఒప్పుతూ ఉంది. చిటికిన వ్రేలి పూస మీదికి వచ్చేట్లు వదులొదులుగా పట్టుకొని చిమ్ముల సురెకత్తి ధరించి-దాని కాంతులు ముమ్మరంగా వచ్చేట్లు-పట్టుకొని ఉన్నాడు. వాని పేరు కాకశ్మశ్రువు. అతడు ఊరి నుండి నన్ను కనిపెట్టుకొని ఉన్నవాడే. వాడు నన్ను తరిమాడు.[17]

నాతో వస్తున్న బ్రహ్మచారిని వదిలేసి-నేను గునుకు పరుగు తీశాను. ఆ చండాల చోరభటుడు సురెకత్తి నా కొంకులకేశాడు, నేను కూలిపోతూనే-నానిగిడిన బొజ్జ మీద నాజెపు దోవతి. దట్టి తెగిపోయేట్లు లాగాడు. నేను పెనిగాను. నా 'వల్లువం' (వరాల సంచిని) తెంచుకున్నాడు. గౌదకట్టు. తాళ్లు కట్టిన కుళ్ళాయిలో ఏముందోనని వాడు లాక్కున్నాడు. ఆ లాక్కోవడంలో నా చెవుల్లోని 'అనంతుని గంట్లు' (నాగుపడగ అంటుపోగులు) తో పాటు నా చెవులు కూడా తెగి పోయాయి. ఇలా నన్ను దోచుకొని వాడు వెళ్తూ ఉండగా-[18] నా 'నోటిశని'తో ఊరుకోక 'ఓరోరి! మాసమీపపు ఊరు లోనే ఉండి కూడా ఇలా చేస్తావా? అయినా ఎంత దూరం పోతావులే. బొమ్మె రీతిని నీకు దక్కుతుంది-కానీరా' అన్నాను.[19]

అలా నేను పలకగానే ఆ దొంగ ఇలా అనుకున్నాడు. 'ఇతడు అధికంగా ధనం పోగొట్టుకున్నాడు కాబట్టి రెడ్డిని. రాజును చూస్తాడు' అనుకొని-నా ప్రాణం తీయడానికి తిరిగి వచ్చాడు. ఇంతలో పై నుండి వచ్చే బాటసారుల గుంపునకు భయపడి పారిపోతూ 'వెడ పోట్లు' పొడిచి వెళ్ళాడు.[20]

ఆ సమయంలో పెద్ద బాటలో వస్తూ ఉండే జన సందోహంలో-నా భార్య సోదరుడు కూడా వస్తూ-బాటసారుల సమూహం దోపిడీపాలైన విషయం విని-నన్ను వెదకి కనుగొన్నాడు. ఆర్తితో తానొక్కడే - ఎంతో అలసి పోయిన నన్ను కావిట్లో పెట్టుకొని - చీవాట్లు పెడుతూ ముందుకు సాగాడు.[21]

అలా వెళ్తూ ఉండే సమయంలో - దోపిడీ దొంగల బారిన పడిన బాటసారుల అవస్థ ఎలా ఉందంటే-'కొంగవాలుకత్తి నరుకుల్ని వేళ్ళతో బిగబట్టుకొని-జబ్బల్ని 'అంటుకట్టు' వేసే వైద్యుల కోసం-కొందరు వెదుకుతున్నారు. తల మీద గుదియకఱ్ఱ దెబ్బల్తో చీలికలైన తావుల్లో-పాత గుడ్డ మసి పెట్టుకొని-ఇండ్ల ముందు కొందరు అంబలి, గంజి బిచ్చమెత్తుతున్నారు

కొందరు తమ కష్టాన్ని చెప్పుకొని - దయతో ఎవరైనా వస్త్రం ఇంచియ్యగా-వారిని దీవిస్తూ ఉన్నారు. కొందరు కపటులు-తాము దోపు పోయిన వృత్తాంతం ఆధారంగా 'కలలేని సిరి' చెప్పుకుని-చుట్టాల ఇండ్లమీద దాడి చేశారు

ఇలాంటి బాటసారులతో ఆ ఊర్లు నిండిపోయాయి. ఆ ఊళ్ళ మీదుగా నన్ను ఇక్కడికి తెచ్చి-ఈ నీడలో దించి-ఏటినీళ్లు తాగడానికి-తాను వెళ్లాడు ఇంతలో నా ఊపిరి పోయి-అతడు తిరిగి వచ్చేలోగా - నాకు ఈ బ్రహ్మరాక్షసి రూపు వచ్చింది.[22]

కయ్యంలో పారిపోతూ పారిపోతూ ఉండగా గాయంచేసి-భయంతో జ్వరం వచ్చేట్లు చేసిన కాకశ్మశ్రుడనే ఆ చండాలుని భీకర స్వరూపం కన్నులకు కట్టినట్లుండగా చూస్తూ చనిపోవడం వల్ల-నాకు ఈ భయంకర వేషం వచ్చింది. కైశికీగాన దాన ఫలంతో-ఈ రూపాన్ని పోగొట్టవా? అని రాక్షసుడన్నాడు దాసరి నాకు ఫలం విషయం తెలియదు. పరమేశ్వరుని ముఖోల్లాసమే భక్తునికి ఫలం-ఆజ్ఞలుగా దేవునికి చేసే కైంకర్యాలకు అనుమతిగా చేసే కైంకర్యాలకు ఫలం ఇంత అని లెక్క పెట్టడం-ప్రసన్నులైన భక్తులకు తగదు. అలా అనడం బంధకం అవుతుంది కాబట్టి-'ఫలం ఇంతః అంత!

అందులో కొంత తీసుకో' అనడానికి భయపడతాను. భగవంతుడే రక్షిస్తాడు ఊరడిల్లు అనే మాటలు దాసరి నోటితో ఉండగానే బ్రహ్మరాక్షసుడు-[23]

సోమ శర్మగా వైష్ణవుడై నిలబడ్డాడు. అతని తల ముప్పావిక భాగం మున్నగా క్షవరం చేయబడి-నిగ నిగలాడుతూ ఉంది. తక్కువ భాగంతో పిగవుంది. అతడు మంచులా తెల్లనైన జంధ్యాలు ధరించాడు. దేహం మీద పవిత్రమైన పం(డెండు నిలువు నామాలు ఒప్పుతూ ఉన్నాయి. తులసి పూసల హారాలు, తామర పూసల హారాలు అలరారుతూ ఉన్నాయి. అతడు గోచి, మొలత్రాడు, కావిలాటి ధరించాడు. శుభకరమైన జల పూర్ణ కమండలు ధరించి ఉన్నాడు. అతని చేతిలో 'దివ్యప్రబంధాల సంపుటి' (ద్రావిడ వేదం అనే విష్ణు స్తుతి గ్రంథాలు) ఉంది. అతడు 'ద్వయ మంత్రం' యొక్క ఉత్తర వాక్యాన్ని జపిస్తూ ఉన్నాడు.

అతడు బంగారు వన్నె దేహంతో - బ్రహ్మ వర్చస్సు ప్రకాశించే వైష్ణవ తేజం కలిగి-రాక్షస దేహం నుండి-పొగ మొత్తం నుండి వెలువడే అగ్ని జ్వాలలాగా వెడలి సోమశర్మ అయి దాసరి ఎదుట నిలిచాడు.[24]

ఈ విధంగా భాగవతుడైన దాసరి పరిచయ ప్రభావంతో - అతనికి బ్రాహ్మణత్వమే కాక వైష్ణవ శోభ కూడా రావడం 'ఉప్పుచింది రెండింతలు అయినట్లుగా' అతడు అత్యానంద భరితుడై-తన రూపానికి తగినట్లు-దాసరికి పూజ చేశాడు.[25] జనన మరణ ప్రవాహంలో తామరాకు మీది నీటి బొట్టు లాగా అతిశయించే వైష్ణవా జయ! గాయక సార్వభౌమా జయ! విష్ణు కథా రసజ్ఞ జయ! పుణ్యరసజ్ఞ జయ! పరమాత్మతత్త్వానికి సంబంధించిన సందేహాలకు కొడవలి లాంటి వాడా జయ! హీనకులంలో పుట్టి మాయచేసేవాడా జయ! గురుచరణ శరణ జయ! చెప్పిన మాట నిలబెట్టుకోనడానికి – దేహాన్ని తృణప్రాయంగా ఎంచేవాడా జయ! భగవంతుని ఆజ్ఞను నిర్వహించే వాడా జయ! సకల జంతువుల మీద సమచిత్తం గలవాడా జయ! దయార్ద్రి జయ! ముకుందుణ్ణి గాక ఇతర దేవతల్ని గురించి చెప్పే శాస్త్రాల్ని వినడంలో బధిరుడైన వాడా జయ! అష్టవిధ భక్తి చిహ్నాలతో నిండిన దేహం గలవాడా జయ! మురారి భక్తుల పాద పద్మాలకు తుమ్మెద అయిన వాడా జయ!'[26]

అని రాక్షసుడు దాసరిని ప్రస్తుతించి-ప్రదక్షిణం చేసి - పునర్జన్మ భయంతో ఇల్లు ఇల్లాలు మొదలైన ప్రముఖ సుఖాలకు విముఖుడై-బదరీవనం మొదలైన హరి నివసించే పుణ్య భూములకు పౌనఃపున్యంగా (మళ్ళీ మళ్ళీ) తీర్థయాత్ర చేస్తూ-మోక్షం పొందాడు.

ఈ పుణ్యకథను భూదేవిని వహించే సమయంలో మహా వరాహస్వామి భూదేవికి వినిపించాడు. ఆ కథ ద్వారా విష్ణు పూజోచిత ఉపచారాల్లో విశేష ఫలం ఇచ్చేది గానమే అని భావించి-తాను వైష్ణవి కూడా కాబట్టి-ఆ గానం మీది కుతూహలంతో-నీకు కూతురై పుట్టి-దిన దినమూ విరహా నెపంతో పాడబడిన గంభీరమైన గాథల (పాటల)లోని గాన మాధుర్య రసంతో పొద్దు పుచ్చుతున్నది గానీ మరొకటి కాదు.

ఏమి తపం చేస్తున్నదో అంటివి-ఇంత కంటే పరమ తపం ఉందా? అన్నీ మేలవుతాయి. శ్రీరంగానికి రంగేశుణ్ణి సేవించడానికి తోడుకొని పోయిరా!' అని మన్నారు స్వామి సెలవిచ్చాడు. 'ప్రసాదం' అని స్వామికి ప్రణామం చేసి-బంగారు పల్లకిలో బాలికారత్నం అయిన గోదాదేవికి ఉంచుకొని-శత పరిచారికలు, వైష్ణవ సమూహం సేవిస్తూ ఉండగా-ప్రయాణాలు చేస్తూ-స్వామి మీద పరమానురాగంతో వెళ్లారు.[27]

అలా వెళ్లి విష్ణుచిత్తుడు శ్రీరంగాన్ని సందర్శించాడు. కావేరి అనే నామాంతరం గలిగిన విరజానది తీరంలో-నందనవనంలా చుట్టూ వ్యాపించిన చెట్ల సమూహం మధ్య-ఆకుల సందుల్లో నుండి దూరానికి శ్రీరంగనాథస్వామి ఆలయ సువర్ణ ప్రాకారం కొద్ది కొద్దిగా కనిపిస్తుంది. ఆ ప్రాకారాల శిఖరాలు-బంగారు కిరణాల్తో ఆకాశం స్పృశిస్తూ ఉంటాయి. ఆ ఏడు ప్రాకారాల్ని చూడగానే -- భక్తుల పాపాలు సంపెంగ పువ్వుల్ని చూసిన తుమ్మెదల్లా దూరంగా తొలగి పోతాయి. ఆ శిఖరాలు-దూరానికి దీపకళికల్లాగా మెరుస్తూ ఉంటాయి.[28]

ఆ విష్ణుచిత్త మునికి చోళ సుందరీ మణుల కొప్పుల్లోని ఎర్రకలువల సుగంధ పరిమళాల కోసం మూగే తుమ్మెదల నినాదాలు-కావేరిలోని కల

హంసల నివాదాలు వినబడ్డాయి. వాటిని ఆయన వద్దకు తెచ్చిన మలయమారు తం-అతని మార్గాయాసాన్ని శమింప జేసింది.[29]

విష్ణుచిత్తుడు కావేరి నీటిలో అఘమర్షణ స్నానం (పాపం పోగొట్టడానికి మంత్రోచ్చారణ పూర్వకంగా చేసే స్నానం) చేశాడు. మధ్యాహ్నికం (మధ్యాహ్న సంధ్యా వందన-బ్రహ్మయజ్ఞ పితృ తర్పణాదులు) మొదలయినవి తీర్చుకొన్నాడు. స్నానంచేసి, అలంకృత అయిన తన కుమార్తె గోదాదేవిని తీసుకొని-వైష్ణవ సమూహం సేవిస్తూ ఉండగా ముందుకు సాగాడు.[30]

శ్వేత దీపంలాంటి ఆ శ్రీరంగంలోని భాగవతుల ప్రవర్తన ఎలాంటిదంటే-స్త్రీల పాదాల అందెల మోతలు వింటూనే-ఏనుగులు ఎదురు వస్తే తొలగినట్లుగా-స్త్రీలకు దూరంగా తొలుగుతారు. తమ ఇండ్ల ముందుకు భాగవతులు రాగానే గృహస్థులు - మణులనే పిడికిళ్లతో పెడతారు వాటిని భాగవంతునికి హారతి ఎత్తి గృహస్థులు వాకిట పోసిన కెంపులతో కలసిపోయేట్లు ఆ మణుల్ని భాగవతులు వారి వాకిండ్ల వద్దనే చల్లుతూ ఉంటారు పువ్వులు మొదలైన వాటి పరిమళం ఆఘ్రాణించకుండా - భగవంతునికి నైవేద్యం కోసం పెట్టిన పణ్యారపు పరిమళం కోసం లాగా-ఊపిరి పీల్చడం ఆపుకుంటారు. నృత్యంతో పాట వినబడగానే-చిలుకల గోరువంకల వారి నామోచ్చారణలాగా అర్ధాంగీకారంతో వింటారు-ఆట పాటలకు వారి సమ్మతి లేకున్నా వాటిలో హరి నామ స్మరణ ఉంది, కాబట్టి భక్తితో అంగీకరిస్తారు. ఇండ్ల చూరులలోని రత్నాల కాంతులు-ఆ వైష్ణవుల ధవళ వస్త్రాలపై పడి-వాటికి చిత్రవర్ణాన్ని కలుగజేస్తాయి. అలా చిత్ర వస్త్రధారణ తమకు తగదు కాబట్టి ఆ భాగవతులు-ఆ రత్నాల కాంతుల రంగుల్ని తప్పించుకోవడానికి-త్వర త్వరగా తొలగిపోతారు. అలా వెళ్తూ 'అమ్మలారా! రత్నాలు పెట్టకండి! ధాన్యమే భిక్షంగా పెట్టండి. అవి భిక్ష అడుగుతుంటారు. భక్తికి ప్రతిబంధకం అయినందువల్ల ధనాన్ని తమ వద్దకు రానీరు, అలాంటి నిరక్త భాగవతుల సమూహంతో-శ్రీరంగం శ్వేత ద్వీపంలాగా ఒప్పారుతూ ఉంది. అలాంటి శ్రీరంగంలోకి విష్ణుచిత్తుడు ప్రవేశించాడు.[31]

పిల్లగాలులు చంద్రపుష్కరిణీ నీటి తుంపురుల్తో తడిసి-గుహల్లాంటి పురగోపురాల సమూహాల వద్దకు వ్యాపించి - మ్రోగుతూ ఉండే మేలుకట్ల రత్నాల చిరుగంటల అవ్యక్తమధుర ధ్వనుల్తో - విష్ణుచిత్తమునికి 'సుఖ ప్రయాణం జరిగిందా' అని అడుగుతూ-స్వాగతం పలికాయి. స్వామి దర్శనం అనే తీవ్రకాంతతో గుడి ద్వారం ప్రవేశించి-ఆ ద్వారం వద్ద తొందర పడుతూ ఉండే దేవతా సమూహాన్ని చండుడనే ద్వార పాలకుడు అదిలిస్తూ ఆపుతూ ఉండగా చూశాడు.[32]

అక్కడ మణిమయ వేదికపై తివాసీ మీద విష్వక్సేనుడు తన అధికార చిహ్నమైన బెత్తాన్ని చేతిలో ధరించి-శ్రీరంగనాథుని ప్రతిమ ఉండే ముద్దుటుంగరాన్ని వేలికి ధరించి కూర్చొని ఉన్నాడు. అతని ఇరువక్కలా విశ్రులుతై కొద్దిగా వంగిన దేహంతో-మూర్గురు దంత వక్త్రులు వినయంతో కలిస్తూ ఉన్నారు. ఆలాంటి విష్వక్సేనుణ్ణి దర్శించి-విష్ణు చిత్తుడు వందనం చేయగా-అతను కూడా విష్ణుచిత్తుణ్ణి పూజించాడు[33]

వేద స్వరూపుడైన గరుత్మంతుడు అక్కడే ఉన్నాడు. ఇంద్రుని వజ్రాయుధం సోకనందువల్ల మెరిసిపోయే బంగారు పర్వత శిఖరంలాగా అతని రెక్కల కాంతులు - అన్ని దిక్కుల్లో ఆకాశంలో - పిరెండలాగా మెరుస్తూ ఉన్నాయి. ఆ వినతాసుతుణ్ణి నమస్కారంతో దర్శించి-విష్ణుచిత్తుడు తిరిగి అతని నమస్కారం పొందాడు.[34]

## శ్రీరంగనాథస్వామి వర్ణన

విష్ణుచిత్తుడు శ్రీరంగనాథ స్వామికి గరుత్మంతునితో విజ్ఞాపన చేయించి అనుమతి పొందాడు. అక్కడ ఉండే ముక్తులు నీల మేఘ శ్యాములు, శత వత్రాలైన పద్మనేత్రులు. మెరుపు లాంటి పీతాంబర ధారులు, వనమాలి కల్ని రొమ్ము మీద ధరించిన వారు. విష్ణువు ప్రతిబింబాల్లాగా ఉండే పార్శ్వవర్తులైన నమ్మాళ్వారు మొదలైన అలాంటి ముక్తుల్ని సేవిస్తూ-వారి చేత అభినందితులై ముందుకు సాగాడు. మహా విశాలమైనది-మణిమయ స్తంభాల చేత ధరింపబడింది-బంగారు కలశాలతో అలంకృతాలైన శిఖరాలు గలది అయి

పలురంగుల వస్త్రాలకో తయారైన మేలుకట్లలో వ్రేలాడే నానా విధాలైన పూలదండలు, ముత్యాల గుత్తుల్ని, అచ్చ చామరాల్ని కలిగింది-మేరమీరిన నల్లని అగరు ధూపంతో ధూపం వేయబడింది అయిన మహాగర్భ గృహం లోని చంద్రకాంత వేదికపై-పాదాలు మొదలయిన ఆయా అవయవాల్లో ప్రతీకలుగా ఉంచబడిన ధర్మవర్మ మొదలైన నిత్యసూరుల సమాజంతో-తేజోమయమైన విపులమైన విమలమైన సింహాసనం మీద-పరిమళాల కోసం సంచరిస్తూ ఉండే తుమ్మెదల సమూహంతో కూడిన కమలం యొక్క బంగారు రంగు కలిగి ఉన్న విస్తీర్ణమైన కర్ణిక మీద-క్షీర సముద్రానికి ఆదికారణమైన ఆది భూతంలాగా (సూక్ష్మావస్థలో ఉండే పాలులాగా) పాదరసం, మణులు, శ్రీగంధం, చంద్రుడు, తెల్ల తామరల యొక్క ధావళ్యానికి మస మసకల్ని ఆపాదిస్తూ ఉన్న కాంతి గలిగిన శేషుని పడగ భాగానికి గుణోత్కర్ష అతిశయించేట్లు-అశేష శరీరమయమైన తలగడ మీద-మహార్హమైన కేయూర మణులతో-చిత్రవర్ణమైన మోచేతిని ఊదుకొని-ధ్యాన పరులైన మునుల మనస్సుల్లోని అనురాగ రసంతో తడవబడడం చేత - మిగుల ఎర్రదనం వహించిందేమో అన్నట్లున్న-ఎర్రని హస్తం-చెక్కిలిని సమీపించగా-చెంపకింద శ్రీ హస్తాన్ని పెట్టుకొని ఉన్నాడు. కల్పవృక్ష పుష్పాలతో కప్పబడిన శేషుని తుబుసమే అయిన దుకూలమైన వలువ మీద ఒత్తిగిలి ఉన్నాడు. గజేంద్రుణ్ణి బాధించి-కఠినమైన తన చక్రంతో ఖండితమైన మొసలి-పూజ్యమైన సాయుజ్యాన్ని పొందిందేమో అన్నట్లు మీది భాగంలో తెన్నగా కనవచ్చే-గండస్థలంలో ఉండే మణిమకర కుండలాల ప్రతిబింబ కాంతుల ఆధిక్యంతో-పరమ సౌందర్యమైన మకరందాన్ని కురిసే ముఖారవిందాన్ని రెప్పవాల్చని దృష్టితో-ప్రయాసపడి చూసేటప్పుడు నల్లని తెల్లని వర్ణం కలిగిందీ - రెప్ప వాల్చే సమయంలో అధికంగా నేత్రాలకు ఎదురయ్యే వెండిడిలాగా-మిక్కిలి తెల్లనైన మహాతేజ ప్రవాహంలో మునిగి-దుర్నిరీక్ష్యమైన, మనోహరమైన దివ్యమంగళ విగ్రహంతో ఉన్నాడు. ఆ స్వామి నిరాకారుడై కూడా సేవించే వారికి తన రూపాన్ని చూపడానికి సాకారుడై దీపించేవాడు.

చంద్ర సూర్యుల భార్యలైన రాత్రిచేత, ఛాయాదేవిచేత ప్రేమతో పొదువబడినవి. నల్లనివి దీర్ఘాలు అయిన కంటిరెప్పల నీలిమతో ఒప్పే-చంద్ర సూర్యమయాలైన, విశాలాలైన, దీర్ఘాలైన ఎఱ్ఱసిరల కన్నుల్తో-కెందమ్మి రేకుల్ని వ్యాపింప జేస్తున్నాడు.

మంకెన పుష్పం బింకాన్ని ఇంకించే అధరారుణిమ అనే నెపంతో వెలిగే నెమ్మోము నుండి-ఉత్పన్నుడైన అగ్నిహోత్రంతో - అతని సఖుడైన వాయువును కలపడానికి నిక్కించేమో అన్నట్లు, కొద్దిగా నిక్కి చొక్కమైన పుటాలతో దర్శనీయమై-నువ్వు పువ్వు విలాసాన్ని ఆపహాసించే నాసికతో-స్వామి ప్రకాశిస్తూ ఉన్నాడు.

నాభిలో పుట్టిన శ్వేత కాంతిగల పద్మాన్ని చూసి-గొప్ప ఆశ్రయాన్ని పొందిన పున్నమ చంద్రుడు అనే సందేహంతో-ఆ చంద్రునికి, రాహువైన తనకు వైరం మాన్పమని-ఆ చంద్రుని సహోదరి అయిన శ్రీదేవికి రత్న కాంచనాలు లంచాలుగా సమర్పించి-స్వామి పాదాలు ఒత్తుతూ ఉండే శ్రీదేవికి 'వరముపడి ఉండే' రాహువేమో అన్నట్లు-భుజకీర్తులతో, కడియాల్తో, రతనాల ముద్దుటుంగరాల్తో చిహ్నితమైన పరిఘాయుధం వంటి భుజాన్ని - కటి పార్శ్వంలో ఉంచుకొని ప్రకాశిస్తూ ఉన్నాడు.

వక్షస్థలం మీద ఉంచబడిన తులలేని గొప్పదైన కౌస్తుభమణి కాంతుల సమూహంలో-నిండు పథ దీరిన కమల నివాసిని అయిన లక్ష్మీదేవి దేహకాంతేమో అన్నట్లు-మిక్కిలి స్వచ్ఛమైన శ్రీవత్స అనే మచ్చతో-స్వామి కన్నుల పండువు చేస్తూ ఉన్నాడు.

కస్తూరి సువాసనల్నే జయించిన నాభి నెత్తావికి ఎగసి వచ్చే-తరచైన తుమ్మెదల వరసేమో అన్నట్లు-మెరుస్తూ ఉండే నల్లని లేత తులసీ దళాల వనమాలికతో-అభిరామ కోమలమైన అలంకరణ కలిగి ఉన్నాడు.

మహాయా సింహామై హిరణ్యకశిపుని ప్రాణం హరించి-మళ్ళీ మనుష్యాకారాన్ని గ్రహించేటప్పుడు జ్ఞప్తి రానందువల్ల - అలాగే ఉన్నాడేమో అన్నట్లు-సూక్ష్మమైన మేలిమి నడుముతో-కడు శృంగారమైన వాడై ఉన్నాడు

ఘనమైన ఋషభం అనే ఉదయ పర్వత ఊర్ధ్వ ప్రదేశంలో-బంగారు మొలనూలులోని మణి శ్రేష్ఠం అనే సూర్యుడు కానే మెండైన నీరెండ ఏమో అన్నట్లు-ఒప్పుతూ ఉండే మెరుగు పీతాంబరంతో ఆచ్ఛాదింపబడి-దాని సన్నదనం వల్ల తొడల నున్నదనం వెలుపలికి కానరాగా - బంగారు, పుష్య రాగాల సంబంధం గలిగిన తెరలు గలిగిన వైడూర్య మణిస్తంభాల జతలాగా కొంచెం కప్పబడిన నీలిమమైన తొడ దోయి కలిగి ఉన్నాడు.

త్రివిక్రమావతార సంబంధి అయిన నెమ్మేనుతో - అగ్రహంతో (మీదికి) ఆకాశానికి చాచేటప్పుడు-చంక్రమణ వేగంవల్ల చుట్టి వచ్చిన-మణి మయమైన స్వర్గలోకం యొక్క బంగారు వలయం లాంటి ప్రాకారమో అన్నట్లు-మెరిసే ఉద్దండ గండ పెండేరంలో పుట్టే అఖండకాంతుల సమూహం వల్ల-కూర్చబడిన మంత్రిపండుల్లాంటి మడమల్తో ప్రకాశించి-భవిష్యత్తులో తన కూర్మావతారానికి సూచకాలులాగా - లేతతాబేళ్ళ మేలిమిని పరిహాసించే మీగాళ్ళతో-స్వామి ఒప్పారుతున్నాడు.

ఎర్రకలువల్లాగా మృదువైన గర్భాలు (అరగాళ్లు) అమరగా-మెరుగు చుక్కల జిగిని భంగపరిచే గోళ్ల మండలాల (చక్రవాళాల) వెన్నెలల్తో-భక్తుల మనస్సుల్లోని శోకమనే చీకటిని ఛేదించే హలం, కులిశం, కలశం, కమలం, మకరం, అంకుశం మొదలైన రేఖలచేత చిహ్నితాలైన - లక్ష్మి కుచం మీది కుంకుమ పూతతో అరుణారుణాలైన ఆభరణాల్తో - స్వామి ఉన్నాడు.

ఆధ్యాత్మికాధి దైవికాధి భౌతికాలనే తాపత్రయాన్ని రూపుమాపే నారాయణుణ్ణి, పురాణ పురుషుడు, పురుషోత్తముడు, ప్రణత ఆర్తిహరుడు, వాసుదేవుడు, హృషీకేశుడు, ఈశ్వరనుతుడు, విభీషణ వరదుడు, మన్మథ జనకుడు అయిన శ్రీరంగనాథున్ని దర్శించి-తనతో పాటు వచ్చిన భాగవత పరిషత్సమేతంగా-తానూ తన కుమార్తె అయిన గోదాదేవి కూడా సంతోష భయభక్తిరసమగ్నులై-జయ జయ శబ్దాల్తో సర్వావయవాలు నేలను స్పర్శించే వారై నమస్కారాలు చేసి-లలాట ప్రదేశంలో అంజలి ఘటించారు. తర్వాత విష్ణుచిత్తుడు స్వామిని ఇలా వినుతించాడు.[35]

బ్రహ్మ గృహంలో అక్షయమైన ధనానికి నిక్షేపమైన నీకు (శ్రీహరికి) శరణు! (శ్రీరంగ నాథుణ్ణి బ్రహ్మ తన లోకంలో తన గృహ దేవతార్చనగా పూజిస్తూ ఉంటాడు.) దీర్ఘకాలం ఆచరింపబడిన (కూడ బెట్ట బడిన) ఇక్ష్వాకు రాజు పుణ్యరాశి అయిన నీకు ప్రణతి! కుబేరుని సోదరుడు విభీషణుని కులదేవత అయిన నీకు జోహారు! ప్రణతులైన శివుడు మొదలైన దేవతలు గలవాడైన నీకు నమస్సు![36]

సర్వేశుడు, సర్వాత్మకుడు, అనంతుడు, అప్రకాశుడు (గోచరించని వాడు), అభేద్యుడు, సమస్త లోక సముదాయ ఆధారుడు, అణు సమూహా లలో సూక్ష్మతముడైనవాడు, అనాధారుడు, నిత్యుడు, సత్యుడు అయిన నిన్ను సేవిస్తాను.[37]

నారాయణుడు (సర్వాంతర్యామి నారాయణుడు), భూమి మొద లైన బరువుగల పదార్థాల సమూహం కంటే హెచ్చుగా, అతిశయించే గరిష్టత కల పరమ పురుషుడు-అయిన నిన్ను శరణువేడి స్తుతిస్తాను.[38]

బ్రహ్మ, శివుడు మొదలైన వారితో కూడిన ఈ సమస్త జగం ఎవ్వనిలో పుడుతుందో, ఉంటుందో, లయిస్తుందో-అలాంటి మహిమకు చోటైన నిత్యుడు, సమస్త భూత మయుడు దేహేంద్రియాదుల కంటే, సర్వజీవుల కంటే పై వాడయిన నిన్ను - మహామహుణ్ణి (గొప్ప తేజం కలవాణ్ణి) స్తుతిస్తాను.[39]

పరుడి (దేహేంద్రియాలకు ఇతరుడైన జీవుడు) కంటే పరుడు అనబడే వాణ్ణి, పరమాత్మణ్ణి, ముక్తికోసం పరమ యోగి సమూహంతో సదా భావింపబడే వాణ్ణి, ఎవనిలో ప్రాకృత గుణాలు అయిన సత్త్వాదిగుణాలు సందడి ఉండదో అలాంటి విమలుణ్ణి, సర్వప్రాణుల కంటే ఆద్యుణ్ణి, శుద్ధుడు అయిన వాణ్ణి, విభుణ్ణి, కళాకాష్టాది మేషం మొదలైన కాల సూత్రం అయిన ఎవని శక్తి ఇంద్రియ గోచరం కాదో, ఏమీ అంటని వాడై వర్తిం చడం వల్ల అతివిశుద్ధుడు తానై కూడా-ఆరోప వ్యాపారం వల్ల పరమేశుడై ఉన్నాడో అలాంటి విష్ణువైన నిన్ను భావిస్తున్నాను.[40]

అని నిత్యముక్తులకు సేవనీయమైన పర స్వరూపులైన వేల్పులకు సేవ్యుడైన వాని యొక్క - భవ్యమైన దివ్యమైన మంగళ అవతారాల లీలల్ని ప్రస్తుతించాడు. కౌస్తుభాభరణుడైన హరి కరుణా తరంగితాలైన కడగన్నుల్తో-ఆ మునిని చూసి, కుశల ప్రశ్నలు వేశాడు. కంకణాలంకారాల నుండి కల నాదాలు వినిపించగా-తన పాద పద్మాలకు కుసుమాంజలుల్ని సమర్పించే సకల సీమంతినీ తిలకమైన ఆముక్తమాల్యద రూపును, ఎల ప్రాయాన్ని సాభిప్రాయంగా చూచి హరి తనలో ఇలా అనుకున్నాడు.[41]

'ఈ గోదాదేవి చూపు ఎదురెక్కినందువల్లే-యుద్ధం చేయడానికి మన్మథునికి 'బిరుదు టెక్కెం' (మీనం మన్మథుని జెండా గుర్తు) కలిగింది. ఈమె నడుము విలాసంగా అల్లాడడం (కదలాడడం) వల్లనే - భూమి మీద చైత్రునికి కాలు మోపడానికి అవకాశం కలిగింది. (ఆమె నడుము లతలాగా సన్నగా అందంగా ఉంది. లతలు వికసించడం వసంత ధర్మం) ఈమె పాలిండ్లు ఉబ్బినందువల్లే-రతి చేతి కిన్నెర మ్రోతకు వన్నె కలిగింది. (తుంబివల్ల కిన్నెరకు మంచినాదం వస్తుంది. గోదాదేవి పాలిండ్లు తుంబీ ఫలాల్లాగా నిండారుతున్నాయి.) ఈమె మోము ఒప్పారినందువల్లే-వాణి వాహనం అయిన రాజ హంసికి గూడు కలిగింది. (వాణి హంసికి తెల్లతామర నివాసం-గోదాదేవి ముఖం సిత పద్మంలాగా ఒప్పారుతూ ఉంది ) ఈమె నిడుపాటి వెంట్రుకలు ఏపారినందువల్లే-పెంపుడు నెమలి విరహం పొంద గలిగింది. (మయూరి మేఘాన్ని ప్రేమిస్తుంది. ఆమె నిడుపాటి శిరోజాలు కారు మబ్బుల్లాగా అతిశయిస్తున్నాయి.)

ఈమె అడుగులు ఎరుపు మీరినందువల్లనే-దప్పిగొన్న తుమ్మెదలకు మెట్టపంట కలిగింది. (తుమ్మెదలు సులువుగా తేనె ఆస్వాదించడానికి-మెట్టతామరలలాగా రంజిల్లుతున్నాయి.)[42]

ఇలా అనుకుంటూ రంగనాథస్వామి ఉవ్విళ్లూరి-తమకం అపుకోలేక ఆమెను తన దివ్యాంతఃపురానికి చేర్చాడు. ఆమె స్థానంలో - ఒక మాయా గోదాదేవిని కావించాడు. గోదాదేవి తమ వద్దే ఉంతని-అందరూ అనుకుంటున్నారు.[43]

పూజకుల చేత పాద తీర్థం, ప్రసాదం, పరివేష్టనాలు (గుడిలో పూజాది విశేషాల్లో శిరానికి చుట్టే వస్త్రం) విష్ణుచిత్తుడు మొదలైన వారికి-రంగనాథుడు ఇప్పించి విడిదికి అంపాడు. గుడి వెడలి మాయా యువతిని పల్లకిలో పెట్టి విడిదికి వెళ్ళి పంజరం ముసుగును సడలించి విష్ణుచిత్తుడు చూశాడు. ఆమె కనిపించలేదు.[44]

'అబ్రహ్మణ్యం! అన్యాయంగా నా కూతుర్ని అపహరించాడు. ఈ రంగభర్త తాను బ్రహ్మాది దేవతల్ని వారివారి హద్దుల్లో నిలిపి, ప్రభుత్వం వహించి కూడా ఈ విధంగా దోచుకుంటాడా? ఈ బక్క బ్రాహ్మణుణ్ణి 'దయ చూడండి' అంటూ-దుఃఖ సముద్రంలో మునిగి-కన్నీరు అడ్డుపడిన స్వరంతో-కృశించిన ఎండు గడ్డిలాంటి బాహువులు పైకెత్తి విష్ణుచిత్తుడు మొరపెట్టాడు.[45]

ఆ రంగ భర్తకు అంత వేడుక అయితే గోదాదేవిని పెండ్లికావడానికి నేనే ఇవ్వనా? నా దేహం, ప్రాణం, సంతానం, ఇల్లు, ధనం, పంటలు పశుశ్రేణులు-ఇవన్నీ ఆయన భక్తులకివ్వడానికే గదా! అలాంటప్పుడు ఈ బుడుతను ఆయనకు ఇవ్వడం ఏమి గొప్ప? నన్ను ఇలా కురుచగా విస్తే ఆయన్ని ఎవరైనా మెచ్చుకుంటారా?[46]

ఓ కేశవా! శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు నీకు చెప్పడానికి అశక్తులు-ఎందుకంటే వారు నిన్ను సేవించే వారు కాబట్టి విరంకుశుడివని ధర్మం తప్పడం చెల్లుతుందా? ఈ ప్రపంచాలన్నీ నీవయినా-నీ వద్ద దయానిధి అమ్మ (మహాలక్ష్మి) లేదా? భాగవతులు లేరా? వారు నా కోసం చెప్పగలరు.[47]

లోకాతీతలైన శ్రీలక్ష్మీదేవి, నీళాదేవి, భూదేవి ఇల్లాండ్రుగా ఉండగా ఈ 'నెట్టికసీల' (సదాచార పరతంత్ర) మీద నీవు మనసు నిల్పడాన్ని ఏమనాలి? పేదవాణ్ణయిన నన్ను వెర్రివాణ్ణి చేసి పరిహాసం చేయాలని కాక పోతే-నా కూతురిలో అంత అతిలోక సౌందర్యాన్ని చూశావా? నడుల వంకరల్ని, నీటి డొంకల్ని ఎవడు దిద్దగలడు?[48]

అని ఇలా బ్రాహ్మణుడైన విష్ణుచిత్తుడు మొరపెట్టగా, విష్ణుచిత్తుని శోభకు భువన భర్త అయిన శ్రీరంగనాథుడు భయపడి-అతని భాండసానికి గేలి చేస్తున్నాడు-అనే భావం అతనికి తోచేట్లు-మకర కుండలాలతో తేజరిల్లే అద్దాల్లాంటి చెక్కిళ్ళ మీద చిరునవ్వు వికసించగా ఇలా అన్నాడు.[49]

'ఓ ముని ముఖ్యా! ముదిమి వల్ల నీకు మతి తప్పింది కాబోలు: నీ కూతుర్ని ఇంటిలోనే వదిలం చేసి వచ్చి-బట్టబయలులో వట్టినింద నా మీద మోపుతున్నావు. ఆ ఇల్లు మరొకసారి చూసి వచ్చి, చంచలలోచన అయిన నీ కూతురు కనిపించక పోతే అప్పుడు నిందిస్తువుగానీలే! విపరీత బుద్ధిమాని వెళ్ళి చూచి రావో'![50]

అని శ్రీరంగనాథస్వామి అనగానే-'నా తండ్రీ! అయిందా! మేము ఎప్పుడూ దుఃఖాన్ని ఎరుగం. కడుపు చల్లగా పలికి కరుణ చేశావు! విజయవికా'! అంటూ విష్ణుచిత్తుడు కన్నీరు ఆపుకుంటూ ఇంటికి పరుగెత్తాడు.[51]

ఇంటి వద్ద మ్రొక్కిన తనయ శిరస్సును మూర్కొని - ఆనంద బాష్పాలు ప్రవహిస్తూ ఉండగా-విష్ణుచిత్తుడు తన కూతురు వెన్ను నిమిరి- 'నా తల్లీ నిన్ను చూడగలిగాను' అని ఆనందిస్తూ-ఆమెతో పాటు ఇంటివద్దనే ఉన్నాడు.[52]

రంగపతి తనకు ఆ కన్య గోదాదేవిని అడగడానికి సరస్వతీ బ్రహ్మల్ని, గౌరీ శివుల్ని పంపించాడు. వారు విష్వక్సేనునితో కూడా రాగానే- విష్ణుచిత్తుడు సంభ్రమంతో కూడుకొన్నవాడయ్యాడు.[53]

విష్వక్సేనుడు మొదట రాగా వెంట వచ్చిన బ్రాహ్మీ బ్రహ్మలకు, శివానీ శివులకు వినయంగా ఆతిథ్యాలిచ్చి-ఉచితాసనాల మీద ఆసీనులై ఉన్న వారి రాకకు కారణం ఏమిటో అడిగి తెలుసుకొని-ఆనందరస భరిత అంతరంగుడై ఇలా అన్నాడు.[54]

## గోదాదేవి రంగనాథుల కళ్యాణం

'విష్వక్సేనా! బ్రహ్మదేవా! శంకరా! రంగభర్తకు ఈ కన్యక గోదాదేవిని ఇచ్చే భాగ్యం కలిగి ధన్యుణ్ణయ్యాను. భృగువు గౌరవం, సముద్రుని రీతి నాకు అబ్బింది, ఇలా అడిగి పెండ్లాడడం అన్యాయం కాదుకదా![55]

(లక్ష్మి మొదట భృగువు కూతురుగా ఉండి తర్వాత సముద్రునికి తనయగా ఉద్భవించింది. అందువల్లనే లక్ష్మి భార్గవి, క్షీరసాగర సుత అయింది)

ఇయ్యదగిన సంబంధాన్ని గురించి సామాన్య జనులు ఇతడు 'ఈమెను కని మోచి శ్రీరంగానికి తెచ్చి ఇచ్చాడు' అని చులకనగా భావిస్తారు. కాబట్టి మాపురం అయిన విల్లిపుత్తూరుకు స్వామి వారు విజయంచేస్తే పుత్రికనిస్తాను'.[56]

ప్రభుత 'వల్లి వరమేశ్వరుడైనా తన ఆశ్రిత జనం అయిన మీకు ఈ చనువు ఇస్తాడు.' శౌరి తానే కట్టిన ఈ పెండ్లి కొడుకు వేషం వేయడం మాకు గొప్ప. ఆ గౌరవాన్ని మాకు దక్కించడం అతని ఘనత'![57]

అని విష్ణుచిత్తుడు చెప్పగా దయారసార్ద్ర చిత్తుడై-విశ్వభర్త పక్షి ప్రధానమైన గరుత్మంతుణ్ణి అధిరోహించి - బ్రహ్మాది దేవతలు తమ తమ వాహనాలెక్కి సేవించిరాగా-[58] విష్వక్సేనుడు తాను ముందు వెళ్తూ - పెండ్లి వారి సందర్శి వరసలు తెల్పి - తన వెంట తీసుకెళ్లాడు. అలా పౌజు తీర్చిన (వ్యూహం పన్నిన) ప్రజల భూషణాల ఖడ్గాల, వజ్రాయుధం యొక్క శతకోటి సూర్యుల ప్రభలు-దిక్కుల్లో అధికంగా అలముకున్నాయి[59]

అలా శ్రీవిల్లిపుత్తూరుకు వారు వెళ్ళి-విశ్వకర్మ మణిమయంగా కట్టిన విడిది పట్టులో ప్రవేశించారు. ఆ ఆదిమ పెండ్లి కొడుకు అయిన శ్రీహరి - దివ్యాప్సరసలు పసుపు మొదలైన స్నానీయ మంగళ ద్రవ్యంతో అలంకారం చేయగా-పెండ్లికొడుకయ్యాడు, దేవ దుందుభులు, నారదాది దివ్య మునుల గానాలు శబ్దిస్తున్నాయి.

రంగనాథస్వామి వెండిలాంటి ధవళ దివ్యమేఘాలు కురిసే అమృత ధారలతో-అభిషిక్తుడయ్యాడు, ముత్యాల సరాల తోని కౌస్తుభ రత్నంతోను అలంకరింపబడిన శంఖంలాంటి కంఠంతో, కేయూర కంకణాలతోను అలం కృతుడయ్యాడు. మకర కుండలాలు, కిరీటం మొదలైన భూషణాలతో విభూషి తుడయ్యారు. దివ్యమైన అంగరాగం (మైపూత) అలదుకొన్నాడు. పీతాంబ రాన్ని ధరించాడు. తులసీ కల్పవృక్షాల పూలమాలతో ఆశ్రితమైన వక్షం కల వాడయ్యాడు.

ఇక్కడ ఇలా ఉండగా అక్కడ విష్ణుచిత్తుడు గృహ ప్రవేశం చేసి-సంభ్రమాయత్తుడైన విష్ణుచిత్తుని ప్రయత్నంతో -[60] పార్వతి, వాణి మొదలైన దేవతా స్త్రీల సమూహం-పూర్వం ఆచరించబడిన సీతా రాముల కళ్యాణానికి సంబంధించిన అతిశయాలైన గీతాల్ని వైభవంగా పాడారు.[61] మైత్రితో ఏకావళి, స్రగ్విణి ఇరువైపుల వింజామరలు వీస్తూ ఉండగా-గోదాదేవిని పెండ్లి కూతుర్ని చేసి-ఋషి పత్నులు ఆశీస్సహితంగా పసుపు ద్రవంతో నలుగులు పెట్టారు.[62]

అలా వివాహ దీక్ష జరగ్గా, వాసన నూనెతో గోదాదేవికి తలంటి, శిరోజాల్ని గంధంతో పులిమి, స్వర్ణ మణిమయమైన కడవల్తో చల్లని జలంతో జలకమాడించారు. దేవతా స్త్రీ ఒకామె[63] ప్రేమతో తడి తుడిచి నాణెమైన సన్న చీర కట్టించింది. ఒకామె మణిపీఠం మీద కూర్చున్న గోదాదేవి మెరిసే పొడవాటి శిరోజాలు ఆరబెట్టి-ధూపం వేసి కొప్పు తీర్చింది.[64]

ఒక అతివ లత్తుక నీళ్లని గోదాదేవి ఎర్రని పాదాల గోర్ల వరుసలకు పూసింది. ఒక పడతి గోదాదేవి నయమైన వేళ్ళకు మట్టెలు, పిల్లాండ్లు-పాదాలకు అందెలు అమర్చింది. ఒక వెలది కుచ్చిళ్లు పెట్టి బంగారు నీటి వ్రాత చెరగు ఉండే తెల్లని పట్టు చీరను-ప్రేమతో గోదాదేవికి కట్టించింది. ఒకామె గోదాదేవి కటిసీమలో బంగారు మొలతాటిని, కంఠంలో తారహారాల్ని అమర్చింది.

కంకణాలు, హస్తసరాలు, భుజకీర్తులు. ఉంగరాలు. తీగెలాంటి బాహువులకు, వ్రేళ్ళకు అమర్చారు-కమ్మలు, ముత్తెపు ముక్కర పెట్టారు. పాపటలో పాపట బొట్టును ఒకామె నిలిపింది.[65] ఒకామె గోదాదేవి తెల్లని కన్నుగవకు కాటుక రేఖలు తీర్చింది-శరీరానికి కస్తూరి పూసింది. చేర్చుక్క పెట్టి, క్రొమ్ముడికి చెంగలువలు కూర్చింది.[66]

ఈ విధంగా గోదాదేవి అలంకృతయై ఉండగా, లగ్నం సమీపించిందని విన్నవించడంతో-శేషశయనుడైన హరి బయలుదేరాడు. చంద్రసూర్యమండలాలు దివ్వెలై వెలుగుతున్నాయి. తారకల గుంపు గొడుగు

చుట్టూ ఉండే ముత్యాల జాలర్లు కాగా-పద్మ విరోధి అయిన చంద్రుడు గొడుగయ్యాడు, సముద్రుడు సౌగంధిక పుష్పదళాల కానుకతో కూడా-విపణి వీధిలో కల్లాపిచి చిలికించాడు - ప్రకృతికాంత - సురస్త్రీలతో కలుసుకొని (కూడుకొని) ఆ సమీప ప్రదేశాన్ని సవరణ పరిచింది. అగ్నిదేవుడు అగరు ధూపం వేశాడు. మేఘుడు ఉల్లెడ పట్టాడు. వేదాలు వందిమాగధ సంఘాలై-బిరుదు కైవారాలు పఠించాయి. నారదసనందనాది మునులు - సంగీత మంగళత్వంతో అంతరంగానికి ఇంపుచేకూర్చారు. పక్షి శ్రేష్ఠుడైన గరుత్మంతుడు-మదగజంగా స్వర్ణరత్నమయమైన పల్యాణాన్ని వహించాడు. అలా శ్రీరంగనాథస్వామి అలోక సామాన్యమైన వైభవంతో వెళ్ళగా, భాగవత శ్రేష్ఠుడైన విష్ణుచిత్తుడు పరమ సంభ్రమంతో భక్తి సహిత ప్రణామ పూర్వకంగా-స్వాగతం చెప్పడానికి వచ్చాడు. స్వామివారు తన వాహనం దిగి-విష్వక్సేనుని కైదండ గ్రహించి నడిచి వస్తుండగా ద్వారాల్లో - చంచలాతులు కడిగే స్వామి పాదాల జలం కోసం పైపైన పడుతూ-దేవతలు సిద్ధ సంఘాలు మేము ముందంటే మేము ముందని-భూమిని పర్జలం అయ్యేట్లు ఊడ్చుకొని-ఆ పాన జలాన్ని పుచ్చుకొన్నారు. అలా స్వామి పెండ్లిపందిరి ప్రవేశించి విష్ణుచిత్తుడు నిర్దేశించిన స్వర్ణ పీఠంపై ఆసీనుడయ్యాడు. విష్ణుచిత్తుడు బంగారు చెంబుల్తో-పసిడి పళ్లెంలో ఉంచబడిన తామర పూలలాగా-మృదువులైన చిగుర్లలాంటి స్వామి పాదాల్ని కడిగాడు. షోడశోపచార సహితంగా-సాలంకారమైన మధుపర్కాన్ని సమర్పించగా-స్వామి గ్రహించాడు. విష్ణుచిత్తాళ్వారు, ఆయన దేవేరి ధారపోయగా కన్యకారత్నమైన గోదాదేవిని పరిగ్రహించాడు. తర్వాత-[67] వేల్పు పెద్దలు బంగారు నీటి చిత్రాలు మెరవగా ముత్యాలు కూర్చబడిన నల్లని అంచులు గల పెద్ద తెర పట్టి, లగ్నం సమాసన్నంకాగా-బ్రహ్మాది వేల్పు పెద్దలు-ఆ తెరను కిందికి దించేశారు వధూవరులైన గోదా శ్రీరంగనాథులు ఉప్పొంగుతున్న ప్రీతితో-కనుల తళ తళలు చిరుముర్రాడగా-ఆసక్తితో ఒకరి శిరంపై మరొకరు జీలకర్ర బెల్లం ఉంచుతున్నారు.[68]

అనంతరం రంగనాథుని శిరసుపై-గోదాదేవి ముత్యాల తలంబ్రాలు పోసేటప్పుడు-మెరిసే ఆమె చిగుళ్ళలాంటి వ్రేళ్ళ వ్వర్శకు చక్రి చెమర్చగా-ఆతని దేహం నుండి స్వేద బిందువులు దట్టంగా రాలాయి. ఆ దృశ్యం ఎలా ఒప్పిందంటే-స్వామి స్వేద బిందువులు మేఘం నుండి జారిపడే వర్ష ధారల లాగా, తలంబ్రాల మణులు వడగండ్లులాగా ఒప్పారాయి.[69]

గోదాదేవి దోసిలితో తలంబ్రాలు ఎత్తి పోసేటప్పుడు-శ్రీరంగనాథ స్వామి ఆమె గుబ్బపాలిండ్ల పార్శ్వాలపై తటాలున కన్ను వేశాడు. ఇది గమనించిన గోదాదేవి సిగ్గుతో-బాహువులు స్వామి శిరస్సు మీదికి ఎత్తకుండానే-కొన చేతులతోనే తలంబ్రాలు పైకి ఎగరజల్లింది.[70]

హరి గోదాదేవి గళంలో మంగళ సూత్రం కట్టగా-ఆమె శరీరంలో పులకలు పొటమరించాయి. సతి అయిన గోదాదేవి, పతి అయిన హరి-ఒకరి మణికట్లకు మరొకరు కంకణాలు కట్టారు.[71]

హరి గోదాదేవితో లాజలతో (పేలాల్తో) హోమం వేల్పించి-సప్త పదుల్ని నడిపించాడు ఆమెతో కూడి అరుంధతీ దర్శనం చేశాడు. దేవతలు చదివించిన కట్నాల్ని దయతో స్వీకరించి-వారిని తన అనుగ్రహానికి పాత్రుల్ని జేసి-వారి వారి నివాసాలకు పంపాడు. గోదాదేవిని తోడుకొని శ్రీరంగానికి విజయం చేశాడు. కావేరీ నదీ తీరం ఉద్యాన వనాల్లోని-చందన వృక్షాల పొదల నీడల్లో-నీలవేణి అయిన గోదాదేవిని ఉపలాలనలు చేసి, మన్మథ సామ్రాజ్యం ఏలించాడు. తన చిత్తంలో కరుణ ప్రసరించగా లోకాల్ని ఏలుతూ ఉన్నాడు.[72]

## ఆశ్వాసాంత పద్యాలు

స్వామి పుష్కరిణి తీరాల్లోని రమణీయ గుహాల యొక్క చందన వనం, మొల్లవనంలో నుండి వీచే మంద మారుతం వల్ల చలించే వనమాల గలిగిన వాడా! నిర్మల దివ్య విగ్రహం యొక్క స్థిరమైన కాంతితో నింగి నీలి మను తలకిందులు చేసిన స్వామీ! యాదవాంగన సమూహం ఆత్మగౌరవాన్ని, ధైర్యాన్ని విచ్ఛేదనం చేసే-మంజులమైన పిల్లనగ్రోవి వాదనగల స్వామీ![73]

చక్రధారతో ఖండితమైన సురారి సంఘం కలస్వామీ! పక్షివాహనా! నీ బొజ్జ అనే దొన్నెలాంటి తెల్లతామరలో నిండిన మకరంద ప్రవాహంతో నీటి పావలాగా ఒప్పే బ్రహ్మ గలిగిన స్వామీ![74]

వాలిని రేబదనా! పద్మనేత్రా! పార్వతీ స్తుతా! శార్ఙ్గం వల్ల కదిలే భుజాలు కలిగిన స్వామీ! ముక్కంటి, బ్రహ్మ, దేవేంద్రుని ప్రకాశించే మౌళి మాణిక్యాల కాంతుల్తో-అలంకృతమైన పాదద్వయా![75]

## కవి స్వవిషయం

ఇది నీలాద్రి పూరీ జగన్నాథ క్షేత్రంలోని బలరామునితోను, సుభద్ర అనే చెల్లెలితోను కూడుకొన్న నల్లకలువ కాంతిలాంటి కాంతి గలిగిన శ్రీకృష్ణుని కంటి తుదల చూపుతో - ఒప్పుతూ ఉన్న బాహుబలం యొక్క-సమర్థమైన జయ సన్నాహపు మ్రోతతో కూడిన వాద్యాల భీతితో-కటక పుర రాజైన గజపతిని పలాయనం పాలు చేసిన-కృష్ణరాయ మహీపతి చేత నిర్మిత మైన 'ఆముక్తమాల్యద' కావ్యంలో హృద్యమైన పద్యాల్తో ఏడవ ఆశ్వాసం అలరారుతూ ఉంది.[76]

